# బాలలం మేం బాలలం!

బాలలం మేం బాలలం!

'బాలబోధ'ను వింటుంటాం!! - 2

అమ్మా, నాన్నా గురువే దైవం

పోషణ, రక్షణ, శిక్షణ వీరి ఔదార్యం

శ్రద్ధా భక్తులు మాకు సొంతం!

బాల భక్తులు మా కాదర్శం !!

శ్రద్ధా భక్తులు మాకు సొంతం!

బాల భక్తులు మాకు ఆదర్శం !!

ధృవుడు, ప్రహ్లాదుడు, మార్కండేయుడు....
వీళ్ళకొకటే లక్ష్యం భగవంతుడు!!

గురుమూర్తై వచ్చాడు నారదుడు
చెప్పకనే చెప్పాడు గురుకీలు!!

స్మరణ, చింతన, తపస్సులు....

వీరి జీవితాల్లో నింపినవి ఉషస్సులు!!

బాలలం మేం బాలలం!

'బాలబోధ'ను వింటుంటాం!! - 2

తల్లిదండ్రులు, పెద్దలు, గురుదేవులు...
సత్సంగ మిత్రులే ఆత్మీయులు!!

బాలలం మేం బాలలం!
'బాలబోధ'ను వింటుంటాం!! - 2

కుంకుమ, విభూతిని ధరియిస్తాం!

అనునిత్యం దైవాన్ని ధ్యానిస్తాం!!

బాలలం మేం బాలలం!

'బాలబోధ'ను వింటుంటాం!! - 2

పరోపకారమే పుణ్యమంటూ...
పెద్దలు ఏనాడో చెప్పి నారు !!

పాపమంటే, వేరో యేదికాదు
పరపీడనమే మహాపాపము !!

బాలలం మేం బాలలం!

'బాలబోధ'ను వింటుంటాం!! - 2

పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తము !

పూర్వతాపమే ఎంతో శ్రేష్ఠము !!

పూర్వతాపం కలిగి వుంటాం !

ఎప్పుడూ ఎవరినీ నొప్పించం !!

బాలలం మేం బాలలం!

'బాలబోధ'ను వింటుంటాం!! - 2

మనసులో, మాటల్లో, చేతల్లో...

ఒక్కటే తీరుగా వుండాలి !

నిత్యమూ దేవుని సన్నిధిలో,

ప్రేమ, శాంతులతో మెలగాలి !!

చెట్టును చూసి నేర్చుకోవాలి!

త్యాగభావన అలవర్చుకోవాలి!!

బాలలం మేం బాలలం!

'బాలబోధ'ను వింటుంటాం!! - 2

అలయాలు, మందిరాలు వెళ్తుంటాం!

అమ్మవారిని, అయ్యవారిని దర్శిస్తాం!!

పూజలు, వ్రతములు, అభిషేకాలు
పెద్దలు ఏర్పరచిన సాంప్రదాయాలు

ధూప, దీపం, నైవేద్యం....
దైవప్రీతికై చేయు కైంకర్యం

అర్చనలు, ప్రదక్షిణలు, మంగళ హారతులు
భగవదారాధనలో అంతర్ భాగాలు

బాలలం మేం బాలలం!
బాలబోధను వింటుంటాం!!

కనులను తెరిస్తే జగదీశ్వరుడు

కనులను మూసితే విశ్వేశ్వరుడు

ఈ మాట చెప్పినవాడె నిజగురుడు

ఎప్పుడైనా, ఎక్కడైనా గురువే తోడు!!

బాలలం మేం బాలలం!

'బాలబోధ'ను వింటుంటాం!! - 2

పోషలు, సైన్సులు భుక్తి విద్యలు...!

వేదాలు, ఉపనిషత్తులు ముక్తి విద్యలు...!!

లెక్కల చిక్కులకు, చిక్కుల లెక్కలకు...

పరిష్కార మార్గము వేద గణితము

సర్వమూ శూన్యము, శూన్యమే సర్వము...

నిగ్గు తేల్చి చెప్పేది వేదాంతము

బాలలం మేం బాలలం!

'బాలబోధ'ను వింటుంటాం!! - 2

వాసుదేవ గాయత్రి!

మాపాలిట గంగోత్రి!!

పుణ్యమూర్తు లెందరికో

పురిటగడ్డ ఈ ధాత్రి!!

బాలలం మేం బాలలం!

'బాలబోధ'ను వింటుంటాం!! - 2

ఎందరో మహానుభావులు

అందరికి వందనాలు !

మీ మంచి మాటలే

మా భవితకు బాటలు !!

బాలలం మేం బాలలం!

'బాలబోధ'ను వింటుంటాం!! - 2

కాలము ఎంతో విలువైనది!!

లక్ష్యము లేకుంటే కరిగిపోతాది!!

నామస్మరణతో జన్మ ధన్యము
భగవత్ స్మరణే ముక్తి మార్గము!!

బాలలం మేం బాలలం!
'బాలబోధ'ను వింటుంటాం!! - 2

బాల వాక్కే బ్రహ్మ వాక్కు

బాల బోధ జన్మ హక్కు

బాల వాక్కే బ్రహ్మ వాక్కు

బాల బోధ మా జన్మ హక్కు

ఆర్తి, తపన, పట్టుదలతో...

శిష్యుడు గురువును ఆశ్రయిస్తే,

అన్యన్య భావన కలిగి వుండి

గురువే దైవంగా భావిస్తే

అపార ప్రేమ, వాత్సల్యాలతో...

గురువు శిష్యుడిని చేర దీసి,

సేద తీర్చి, బోధ చేసి, తీర్చి దిద్ది....

తరింప జేస్తాడు ఈ జన్మ లోనే!!

బాలలం మేం బాలలం!

'బాలబోధ'ను వింటుంటాం!!

అంతర్యామిని అనుసరిస్తూ...

ముక్తి, మోక్షం సాధిస్తాం!!

బాలలం మేం బాలలం!

'బాలబోధ'ను వింటుంటాం!!

అంతర్యామిని అనుసరిస్తూ...

ముక్తి, మోక్షం సాధిస్తాం!!